శ్రీ మద్రామాయణ

# కిష్కింధకాండము

(గేయకవిత)

శ్రీ రామచంద్ర ప్రాదాంకితము



కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరం
ఆరుహ్యకవితా శాఖామ్
వందే వాల్మీకి కోకిలం.

శ్రీ వాల్మీకికి ముందుగ మ్రొక్కి
మందర కర్తకు వందనముంచి
రామ భక్తుల ఆశీస్సులతో
రామచంద్రుని కీర్తన చేసెద.

## వినాయకస్తుతి

ఏకదంతము శూర్పకర్ణము
చలువచూపుల చిన్నవాడా
పార్వతమ్మకు ముద్దుకొమరుడ
విఘ్నరాజా వందనమ్ము.

రచన

రామదర్శన ప్రభాసి, రాజకవి

సూరంపూడి రాధాకృష్ణమూర్తి

ప్రథమ ముద్రణ
నవంబరు 1981

మూల్యము : పదిహేను రూపాయలు

ప్రతులకు:
సూరంపూడి రాధాకృష్ణమూర్తి (అడ్వకేట్)

16-11-418/3/1
దిల్‌సుక్‌నగర్-2
హైదరాబాదు-500 036.
(ఆం. ప్ర.)

ముఖ చిత్రం
శ్రీ పేరి సుబ్బారావు, దిల్‌సుక్‌నగర్

ముద్రణ
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గుడా, హైదరాబాదు.



శ్రీ చండిక సాంబశివరాజు

B. E. (Hons), M. S. E. (Lond)
M. I. E. (Ind), M. I. C. E (Ind)
ఎగ్జిక్యూటివ్ ఇంజనీయరు
(పంచాయితీరాజ్ డిపార్టుమెంటు)

కృష్ణా తరంగిణి చల్లగా పాడింది
అల్ల, అరికెపల్లి ఉల్లమే పొంగింది
ఆనందనందనం కమలాంబతల్లిదే
ఈ నందివర్ధనం శ్రీ సుబ్బరాజుదే.

నిండైన విగ్రహం భక్తిపై నిగ్రహం
మనసెంతో స్వచ్ఛము నెయ్యంపు గుచ్ఛము
విద్యావినయములందు ఎన్నికైనవాడు
ఆ ఉషారాణినే ఎన్నుకున్నవాడు

శ్రీరామ సేవలో నే ముందు అన్నాడు
ఈ పూవు విరియంగ నేనుందు నన్నాడు
నిండుగా నూరేళ్లు చల్లగా వుండాలి
మారాజు-మనరాజు-ఈ సాంబశివరాజు.

— రాధాకృష్ణమూర్తి.

శ్రీరామ

# ఉదాత్త భక్తి

- చండిక సాంబశివరాజు

## పరిచయం :

శ్రీరామ సేవాభాగ్యం-శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తిగారు శ్రీమద్రామాయణం యథావాల్మీకంగా తెలుగులో గేయంగా వ్రాయటం, నేను ముద్రణ చేపట్టటం, జనబాహుళ్యాన్ని ఆనందింపజేయటం-పురాకృత సుకృతం. రామ సేవలో పాలుగా ఈ గ్రంథరాజ ముద్రణకు అవకాశం ఇచ్చిన మా మూర్తి గార్కి, వారితోపాటు రామసేవాంకితమైన చిహ్నంగా వారికి ''రాజకవి'' బిరుదాంకితము చేసి, ఆయన పేరుతో నా పేరు జత చేసికొని జంటగా రామసేవ చేయాలనేదే నా ధ్యేయం. ఈ ఆశయ సఫలీకృత భాగ్యం కల్పించిన శ్రీ స్వామి వారికి సర్వదా నా భక్త్యంజలులు.

## రామాయణ రచనలు-పూర్వాపరాలు :

శ్రీమద్రామాయణమునకు మూలం కవికోకిల, మహర్షి వాల్మీకి విరచిత సంస్కృత ఆదికావ్యం. దీనిని అనేక ఇతర భాషలలోకి ఎందరో కవులు, పండితులు వివిధరీతులలో అనువదించి, మానవాళికి అందించారు. తెలుగు భాషలోకూడ ఎన్నో రామాయణ గ్రంథాలు రచింపబడినాయి. అయినా మరి ఇప్పుడు శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తిగారు మరల అదే కథావస్తువును వ్రాయుట ఎందులకు? వీరి రచనలోగాని, వీరిలోగాని ఏదైన ప్రత్యేకత, విశిష్టత ఉన్నదా? నేను ముద్రణ చేపట్టి, భక్తులకు చేరువలోకి చేర్చుటకు దోహదము కలిగించిన ప్రత్యేక పరిస్థితులు ఏమిటి? ఇందు క్లుప్తంగా వివరిస్తాను.

## ఈ రచయిత విశిష్టత :

శ్రీ రాధాకృష్ణమూర్తిగారు స్వతహాగా కవిలోకానికి చెందనివారు. చదువుకున్నది సైన్సు మరియు న్యాయశాస్త్రం. చేపట్టిన వృత్తి, కొంతకాలం సైన్సు సంబంధం, తదుపరి న్యాయవాద వృత్తి. ఇటువంటి పరిస్థితులలో ఇంతటి మహాగ్రంథాన్ని క్రొత్తపంథాలో రచించుట సామాన్య విషయం కాదు. దీని వెనుక తప్పనిసరిగా అతిబలవత్తరమైన దైవశక్తి ఉన్నదని నా గాఢ నమ్మకం. అదే ''శ్రీరామాంజనేయ వరప్రసాదం". మరియు వారి భక్తిభావన దీనికి మరింత శక్తి నిచ్చినది. ''శ్రీవాయు'' వెనుకనుండి వీరి కలాన్ని నడి

పించారని నా దృఢ నమ్మకం. అట్లుకాని పక్షంలో ఇంతటి గ్రంథ రాజ రచన అసంభవము.

## ఈ రచన ప్రత్యేకత :

దేశ భాషలందు తెలుగు లెస్స. ఇది జగమెరిగిన సత్యం. నిజంగా తెలుగు భాష ఎంతో సులభమైన, మధురమైన, సుందరభాష. సంగీత, పద్య, వచనాది వివిధ రీతులలో సాటిలేని మేటిభాష. కాని మన తెలుగు కవులు శ్రీ రామాయణాది గ్రంథాల రచనలో వారి పాండిత్య ప్రాభవ పోషణకు ప్రాధాన్యత ఇచ్చి, పామర జనగ్రాహ్యధారణ శక్తిని విస్మరించి, కఠిన శబ్దాలను, సంస్కృత పదాలను విరివిగా ఉపయోగించి, వారి గ్రంథాలను సామాన్య ప్రజానీకానికి అందుబాటులో లేకుండా చేశారు. ఈ లోటును శ్రీ మూర్తిగారు ప్రస్తుత రామాయణ రచనతో చాలవరకు తీర్చారు. ఎందుకనగా ఈ రచన అతి సరళం, సుందరం. తెలుగుభాష ఇంత మధురంగా ఉంటుందా అనిపించే అందం చిందులేస్తుంది ఈ గేయ కవితలో. ఎటువంటి సంగీత పక్కీలోనైనా పాడుటకు అనువుగా ఉన్నది. ఏ తెలుగువాడయినా (అక్షరాస్యుడుగాని, నిరక్షరాస్యుడుగాని, పండితుడుగాని పామరుడు గాని) చదివిగాని లేదా పాడించుకొని, అర్థం చేసుకొని ఆనందించుటకు అనువైన సులభ శైలిలో ఉన్నది. ఉదాహరణకు ఒక చిన్న మచ్చుతునక—

> ''సుందరరామా నీ ఆదేశము-దశరథాత్మజా నీ ప్రేరణ యిది
> నేనన్నది అసలేదీ లేదు-నాదన్నది నీదయ ఉన్నదని''

ఇది ఎంత సులభంగా, సుందరంగా ఉన్నదో చూడండి. మరియు అనంతమైన నిగూఢ భావమున్నది. సంపూర్ణ భగవద్గీత, ఉపనిషత్, వేద సారాంశము ఈ చిన్ని గేయములో ఇమిడి ఉన్నది.

i) శివునాజ్ఞలేనిదే చీమయినాకుట్టదు-*సుందరరామా నీ ఆదేశము*

ii) భగవత్ ప్రేరణలేనిదే ఏ పని కాదు-*దశరథాత్మజా నీ ప్రేరణ ఇది*

iii) కనిపించేదంతా మిథ్య-*నేనన్నది అసలేదీ లేదు*

iv) కనిపించని నిత్యవస్తువు ఆనేది-*నా దన్నది నీ దయ ఉన్నదని*

ఈ విధంగా వీరి రచనంతా సుందరంగా, విశేష భావనతో కూడిఉన్నది.

## ముద్రణకు ప్రేరణ :

మూర్తిగారు ప్రథమంగా రామాయణంలోని ముఖ్యమైన, సుందరమైన ''సుందర కాండ'' భాగాన్ని గేయకవితలో వ్రాశారు. వారే స్వయంగా పాడి, అనేకమందిచే పాడించి, అనేక ప్రదేశాలలో అనేకమందిని తన్మయులను చేశారు. అంతియకాక, ఒక సుందరబృందాన్ని కూడ తయారుచేశారు. గ్రంథ ముద్రణకోసం వారు శ్రమపడుతున్నారు, ఆనాడు-

1) నాకు కూడ ఈ గానం వినే భాగ్యం కలిగింది. ఎంతో ఆనందం, తన్మయత్వం పొందాను. వెంటనే ఆలోచన కలిగింది-మూర్తిగారు కవిలోకానికి చెందనివారు, ఇంత చక్కగా వ్రాశారంటే, ''శ్రీవారు'' వీరి కలాన్ని నడిపించి ఉంటారని. ఈ ఆలోచనే ముదిరి ముదిరి, ఇది శ్రీ రాధాకృష్ణమూర్తిగారి రచన కాదు, సాక్షాత్తు ''శ్రీరామచంద్రమూర్తి'' రచనే అనే భావన దృఢపడింది. అటులయిన ఈ గ్రంథరాజ ముద్రణ చేపట్టి నేను కూడ స్వామివారి సేవ చేయాలని కోరిక కలిగింది.

2) తదుపరి ఇంతటి ఉత్కృష్టమైన రామకథను, అశేష ప్రజానీకానికి అందించి, ఆనందింపజేసి అందరితోపాటు ఆనందాన్ని పంచుకోవాలని ఇంకొక కోరిక కలిగింది. అందే ఈ విధంగా, మానవసేవ మాధవసేవ చేసి, పుణ్యం, పురుషార్థం పొందాలనే అభిలాష హెచ్చయింది.

3) మరియు నాకు బాల్యమునుండి భక్తిరస గ్రంథాలను వ్రాయించాలని, పండిత పోషణ చేయాలని ఎందుకో తెలియని నిక్షిప్త సహజకోరిక ఉండేది.

మణిపూసలాంటి సాటిలేని శాశ్వత గ్రంథాన్ని ముద్రించే అవకాశాన్ని కలిగించి స్వామివారు నా కోరిక తీర్చి నన్ను కరుణించారు.

## రాజకవి బిరుదాంకితము :

శ్రీ మూర్తిగారినీ నన్నూ జతచేశారు స్వామి. ఇది పురాకృత సుకృతం. ఈ శుభతరుణంలో మా ఈ కలయిక శాశ్వతంగా ఉండటానికి చిహ్నంగా ఆయన పేరుతో నా పేరు జతచేసి 'రాజకవి' అనే బిరుదును మూర్తిగారికి ప్రదానం చేయుచున్నాను.

## ఈనాటి ఉత్సం-ఉత్సాహం :

శ్రీ రాధాకృష్ణమూర్తిగారు శ్రీమద్రామాయణం మూల కావ్యాన్ని యథా వాల్మీకంగా తెలుగు గేయ కవితగా ఇంతవరకు సుందర కాండము, బాలకాండము, కిష్కింధ కాండములను పూర్తిచేశారు. ఇప్పుడు అరణ్యకాండము వ్రాయు చున్నారు.

సుందరకాండము 1979 అనగా సిద్ధార్థినామ సం॥ లో ఆవిష్కరించారు.

బాలకాండము 21-11-1980 అనగా రౌద్రినామ సం॥ర కార్తీకపూర్ణిమ నాడు ఆవిష్కరించబడినది.

కిష్కింధకాండము 11-11-1981 అనగా దుర్మతి నామ సం॥ర కార్తీక పూర్ణిమనాడు ఆవిష్కరిస్తున్నారు. ఎంతో సంతోషం. నిజంగా వీరు ధన్య జీవులు. మిగిలిన భాగాలనుకూడ త్వరలో పూర్తిచేసేందుకు శక్తిని ఇవ్వ వలసిందిగా శ్రీ సీతారామాంజనేయులను ప్రార్థిస్తున్నాను

శుభదాయిని, ముక్తిదాయిని అగు ఈ దివ్య శ్రీరామ కథను పాడి, పాడించి, విని, వినిపించి, ఆనందించి, ధన్య జీవులగుదురని నిండు మనసుతో కోరుచున్నాను. ఇదే నా ఆశయం

## ఇంకొక విశేషం :

శ్రీ రాధాకృష్ణమూర్తిగారు తెనిగించిన చక్కని తెలుగు ''హనుమాన్ చాలీసా'' ఇందు చేర్చబడినది.

## మీనుండి కోరేది :

*''జరుగని పెన్నో మారుతి దయవున్న, జరుగును జగమున అతి సులువుగను''*

*''మారుతిపదములు మదిలో నిలిపి, లోకశాంతిని, శుభములనిచ్చెడి సుందరమూర్తికి వందన మనుచు, అందరు పాడుడు శ్రీరామకథ.''*

*సర్వేజనాః సుఖినోభవంతు*

*ఓం శాంతి-శాంతి శాంతిః*

*ఓం శ్రీరామ-జయరామ-జయజయరామ.*

హైదరాబాదు
1-11-1981

భవదీయుడు
చండిక సాంబశివరాజు.

# మధురం మధురాక్షరం

కిష్కింధకాండ రామాయణ మణిహారంలో కొలికిపూస. ఇటు మూడు అటు మూడు కాండలలో మధ్య నాయకమణి. ఋష్యాలవాలోదితమైన కల్పవృక్ష శాఖా మూలము. శాఖలక్కడే ప్రారంభం ప్రధానమైన కథాగమనానికి ఆయువు పట్టు. నవరసభరితము. అద్భుత చరితము.

రామాయణ కావ్యంలో ఎన్నో నాటకీయ సన్నివేశాలు అడుగడుగున ఉత్కంఠను పెంచే ఘట్టాలు ఈ కిష్కింధ నిండా పుష్కలం. అన్నిటికన్నా ప్రధానమైన ఘట్టం. కృతమస్తకాంజలులమై స్మరించవలసిన సంగతి ఏమిటి? వాయునందన రంగప్రవేశం. హనుమత్ప్రభువు. ఆయన శ్రీరామదూత కావచ్చు. భక్తులకు కొంగు బంగారం. భారతీయ సంస్కృతికి ఆత్మస్వరూపం. గోష్పదీ కృతవారాశి. రామాయణ మహామాలా రత్నద్యుతి. మహామతి. సుగ్రీవుడిని శ్రీరామునికి సంధానించిన మహావేత్త హనుమంతుడు. ఇటుపైన మూడు కాండలలోనూ కథాగమన సూత్రధారి. కిష్కింధ ఏకదేశం గానూ మహామధుర కావ్యం. ఏమంటే, ప్రకృతి వర్ణనలు, వర్షశరదృతు శోభలు, వివిధ మనస్తత్వాలు, లోతైన రాజనీతి, సమస్త భూవలయ దిగంత విస్మయోద్దీపక విశేషాలు ఇందు గలవు.

కిష్కింధ తెలుగువారి జాతీయ జీవనంలో నుడికారం. అయితే ఇటువంటి కిష్కింధ కాండలో మహా మేధావులను సైతం కలవర పరిచింది వాలివధ ఘట్టం. 'చక్రవర్తి పుత్రుడైన సార్వభౌముడు' అనే తమ రామాయణ కథాకథనంలో వ్యాఖ్యానిస్తూ, ఈ ధర్మ సూక్ష్మాన్ని సమర్థించడం కష్టం అన్నారు శ్రీ రాజగోపాలాచారి గారు. ఎదుటబడి కాకుండా కనపడకుండా వాలిని కూల జేయడం ఎలా సమర్థించడం అని, విచికిత్స కనపరిచారు. శ్రీరామచంద్రమూర్తి పుంసాం మోహన రూపుడు. పవనపర్ణాంబుభక్షులైన మహామునులకు సైతం అత్యంత ప్రియదర్శనుడు శ్రీకృష్ణావతారంలో శ్యామసుందరమూర్తి. గోపీ జన వాల్లభ్యానికి శ్రీరామచంద్రమూర్తి లోకోత్తర సౌందర్యానికి అనుసంధానం కల్పించారు. వ్యాఖ్యాతలు. అంతటి సౌందర్యం ఆయనది. వాలికి ఆయన ఎదుట నిలిస్తే పాదాల మీద వాలి వుండడా? అట్లా జరగడానికి వీల్లేదు.

వాలి కామక్రోధాల పోతబొమ్మ. నిర్దయకు నిండైన నిలువు విగ్రహం. వాలి మత్సరగ్రస్తతకు ఆగ్రహానికి అవధులు లేవు. సుగ్రీవుడు పాదాలంటి తన నిరపరాధతను విన్నవించుకొన్నా వాలి వినలేదు. శ్రీరాముడు వాలితోనే సఖ్యం చేసివుంటే సీతాన్వేషణంతో నిమిత్తమే లేదు. రావణుడే స్వయంగా వచ్చి శ్రీరామచంద్రమూర్తి పాదాక్రాంతుడయ్యేవాడు. ఆ విషయం రామ ప్రభువుకు తెలియదా? కాని, పోతన్నగారేమన్నారు? "కలడందురు దీనులయెడ" కలడు కలడు. దీన జన రక్షణం ముఖ్యం. పరమపురుషుని అవతార పరమార్థమదే. దీర్ఘ శరణాగతి అంటారు శ్రీవైష్ణవులు శ్రీమద్రామాయణ పరమార్థాన్ని. అందు

వల్ల రాముడు సుగ్రీవుణ్ణి చేరదీయడం, వెన్ను నిమరడం. వాలి కిష్కింధ కాండలో మూడు చోట్ల రంగం మీద కనిపిస్తాడు. ఆ కనపడినప్పుడల్లా కామ వివశుడిగానే. అట్లానే సుగ్రీవుడిపైన అతడు ప్రదర్శించిన కోపం హద్దు లేనిది. అందువల్ల వాలి వధ్యుడు. మొదటిసారి వాలి సుగ్రీవుల ద్వంద్వ యుద్ధంలో శ్రీరాముడు వాలిని సంహరించకపోవడానికి ఒక అంతరార్థంవుంది. అన్నదమ్ములలో ఎవరు ఎవరో రాముడు పోల్చుకో లేక కాదు! గజ పుష్పమాలను ధరించి సుగ్రీవుడు రెండోసారి తలపడినప్పుడు మాత్రమే వాలిని బాణహతుణ్ణి చేయడంలో శ్రీరామచంద్రమూర్తి దయాసాంద్రత గర్భితమై వుంది. వాలియొక్క రాక్షస ప్రవృత్తిని ఆయన మొదటిసారి సుగ్రీవుడితో వాలి తలపడినప్పుడు ప్రత్యక్షంగా చూశాడు. సుగ్రీవుడితో తొలిసమావేశంలోనే అన్నదమ్ముల మధ్య వైరం బలీయమూ, వైరకారణం బలీయమూ విన్పించవలసిందిగా శ్రీరామచంద్రమూర్తి తన మిత్రుణ్ణి కోరాడు. వైరమే బలీయమని రుజువైంది. ఆ రుజువుకోసమే తొలిసారి వాలిని ఆయన కోలకూలజేయనిది. తప్పనిసరిగా ఆయన వాలిని వధించాడు.

చిరంజీవి రాధాకృష్ణమూర్తి రచన కిష్కింధలో మరింత సొగసులు దిద్దుకొన్నది. సుందర సుందరమే-బాలమేలిమే-అంతకన్నా కిష్కింధ రచనలో నేవళం తొనలు సాగింది. భక్తివిశ్వాసాలున్నచోట పాండిత్యం లేకపోవడమే మంచిది. పండితుడు నీవు నా వాడివి కావాలంటాడు, భక్తుడు నేను నీవాణ్ణి అంటాడు. శ్రీరాముడు ఎవరిమాట వింటాడు?

లేకపోతే చి.రాధాకృష్ణమూర్తి రామాయణం గేయంగా ఆలపించడమేమిటి! అతడి వృత్తికి తెలుగు సాహిత్య విద్వత్తుకు సంబంధం ఏముంది? నేను విద్వాంసుణ్ణి కాదుగదా అని రామకార్యం పట్ల ఉపేక్ష వహించలేదు రాధాకృష్ణమూర్తి. అంతఃకరణవుంటే వ్యాకరణం తెలీకపోయినా ఇబ్బందిలేదు. తక్కిన కాండలు కూడా త్వరగా పూర్తి చేయాలి రాధాకృష్ణమూర్తి. ఇతడు నిమిత్తం. అతడి చిత్తం. కాకపోతే శ్రీ చండిక సాంబశివరాజు గారి అభిమాన రూపంగా రామానుగ్రహం లభించదు కదా! రాజుగారు రాధాకృష్ణమూర్తిని రాజకవి అన్నారు. అంటే తమ అనుబంధం పూవుకు తావిలా వాసించాలని.

రచన అంటూ చేయగలిగిన ఏ వ్యక్తికైనా, చేతిలో కలంపట్టి అక్షరాలు రాయగల ఎవరికైనా రామాయణం గానం చేయాలనిపించడం రాజయోగం పట్టడమే. ఇలాంటి రాజయోగం ఈ రామాయణ గేయకావ్యరచనం. ఈ యోగం గేయంఅయింది. రచయిత రాధాకృష్ణమూర్తిని ఆశీర్వదిస్తూ, అన్నీ తానే అయిన ఆత్మస్వరూపానికి నమస్కరిస్తూ—

దుర్మతి కార్తీక పౌర్ణమి — అ. రమాపతిరావు

11-11-1981 హైదరాబాదు.

# ముందుమాట

—ప్రభల సుబ్బారావు

నా మిత్రులు, న్యాయవాది, నా కుమారుడు డా॥ రాజగోపాల్ సహాధ్యాయి అయిన "రామదర్శనప్రభాసి" సూరంపూడి రాధాకృష్ణమూర్తి నాకు చిరపరిచితుడు. అతను గేయకవితగ వ్రాసిన శ్రీమద్రామాయణ మందలి "బాలకాండ, సుందరకాండ, కిష్కింధకాండ" గ్రంథములను చూడమని యిచ్చెను. వానిని ఆమూలాగ్రముగ చదివి ఆనందించితిని. ఈ చిరుతడు వ్రాసిన గ్రంథరాజములను తక్కుంగల పెద్దలు, జగద్గురువులు కంచికామకోటి పీఠాధీశ్వరులు చదివి రాధాకృష్ణమూర్తిని ఆశీర్వదించుట ముదావహము.

చిరంజీవి కవిత్వము గురించి వేరే చెప్పనక్కరలేదు. వీనులవిందై, అమృత సోనలపొందై విరాజిల్లుచు పాఠకులను ఆనందసాగరమున నోలలాడజేయుచున్నది సులలితవాగ్గుంభనల చక్కగ చెప్పబడెను. సురనదీజలములవలె నిర్మలమై, ప్రవాహోపేతమై మనస్సునకు ఆహ్లాదము నొనర్చుచున్నది.

గ్రంథ విషయము లోకప్రసిద్ధము, గ్రంథకర్త పిన్నవయస్కుడై బృహత్తర గ్రంథమైన ఈ గ్రంథమును గేయరూపమున వ్రాయ సమకట్టి మూలగ్రంథమును బాగుగ చదివి అవగాహనము చేసుకొని ఆర్షగ్రంథమైన ఇంత పెద్ద గ్రంథమును భక్తిశ్రద్ధలతో నిర్మించుట ఆంధ్రభాషా సౌభాగ్యము, సేవయు. భక్తులెల్లరు ఈ గేయకవితలను గానము చేయుటకు అనువుగా శ్రీరామ కథామృతమును యిట్లు పంచిపెట్టుచున్న శ్రీ రాధాకృష్ణమూర్తి ఉద్యమమును సార్థకము గావింతురు గాక! ఏకదీక్షతో శ్రీమద్రామాయణమును గేయకవితగ వ్రాయుచున్న శ్రీ రాధాకృష్ణ కవివరేణ్యునికి అతులైశ్వర్యాయురారోగ్య భాగ్యములు ప్రసాదించమని పరమేశ్వరుని ఒక్కమారు మనఃఫలకమున ధ్యానించెదను.

"చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనం"

ప్రభల సుబ్బారావు
అడ్వకేటు (1-11-1981)

16-2-749/5, శ్రీనికేతన్,
రెవెన్యూబోర్డు కాలనీ,
హైదరాబాదు-500 036

# మాణిక్యమకుటాలు

-కనుమూరి పెద్దిరాజు

శ్రీయుతులు, గౌరవనీయులు, మిత్రులు శ్రీ సూరంపూడి రాధాకృష్ణ మూర్తిగారి సుందర రామాయణము బహు సుందరంగాను, మృదుమధురంగాను, పండిత, పామరులను ఆకట్టుకుంటుందనటంలో అతిశయోక్తిలేదు. వీరు కవి కోకిల వాల్మీకి విరచితమైన రామాయణాన్ని తియ్యని తేట తెలుగున గేయ మాలగా తీర్చి తెలుగువారి కందిస్తున్న తెలుగు బిడ్డడు. వీరిప్పటివరకు రామా యణమునందు మూడు కాండములు పూర్తిచేసినారు. అందు "సుందరకాండము" మొదటిది. "బాలకాండము", "కిష్కింధ కాండము" ద్వితీయ తృతీయములు. ఒక్కొక్క కాండము ఒక్కొక్క మాణిక్యమాల. ప్రతి కాండమునకు ప్రధాన సన్నివేశముల నొక్కచోటచేర్చి మొదటగా ఆ కాండమునకు కిరీటాన్ని అమర్చారు. అవి యన్నియూ మాణిక్యమకుటాలే. తీరిక దొరకక, అనేక వ్యాపకాలతో సతమతమయ్యే మనిషి మనస్సుకు హాయిని గొలిపే వీరి గేయాలు హాయికేకాదు, ముక్తికి, మోక్షానికి సోపానాలు. భక్తిని పెంచి ముక్తినొసగేటి మందార మకరంద మాణిక్యమకుట మాలలు.

మకుటము—

1. సుందర కాండము:- "సుందరమయినది సుందరకాండము
అందరు పాడుదు ఆనందముగా
మృదుమధురము మరి రసవత్తరము
మారుతి సీతను గాంచిన వివరము."

2. బాలకాండము:- శ్రీ రఘురాముని రమ్యచరితము
ముని తిలకుడు మనకొసగిన మంత్రము
రామచంద్రు డుదయించి జానకిని
పరిణయమాడుట బాలకాండము."

3. కిష్కింధకాండము:- "శ్రీ రఘురాముని రమ్య చరితము
మారుతి రాముని సందర్శనము
సీతాసతికై అన్వేషణము
కపులసేవ కిష్కింధ కాండము."

4. వ్రాస్తున్న అరణ్యకాండము :- "శ్రీరఘురాముని రమ్యచరితము
మునిజనములకు అభయ ప్రదానము
సీతాపహరణము రాముని వేదన
జటాయు మోక్షము అరణ్యకాండము."

ఆయా కాండములకవ్వి-కిరీటాలు. మాణిక్య కిరీటాలు. అందులోనే ఆ కాండమునందలి కథావస్తువు అవగతమవుతుంది. అందుకవి మకుటాలు. మనసును తెరిచే కవాటాలు.

భక్తిగా పాడుకొనటకు, పారాయణము చేసుకొనుటకు అనువుగా వుంది వీరి రచన. ప్రతి తెనగవాని హృదయం యీ గేయాలు వింటే పొంగి పొరలుతుందనటంలో సందేహంలేదు. తెలుగు సాహిత్యంలో పోతన్న, గోపన్న, వేమన్న మొదలగువారు ప్రజాకవులుగా ప్రసిద్ధిగాంచారు. అందు పోతన్న గురించి తెలియని తెలుగు వారుండరు. గోపన్న భక్తి, వారి పద్యమాణిక్యాలు, దాశరథీ శతకము చదువుకున్నవారు, చదువురానివారు యీ నాటికీ మరువలేరు. "దాశరథీ కరుణాపయోనిధీ" అనే మకుటం నిజంగా మాణిక్యమే. వేమన్న నీతివాక్యాలు తెలియని తెలుగువారున్నారా? "విశ్వదాభిరామ వినుర వేమ" అనే మకుటం ప్రతీ తెనుగువానినోట నిత్యము వినిపించునదే కదా!

మరి రాధాకృష్ణమూర్తిగారి గేయమాలలు ప్రతి మానవుని హృదయంలో మ్రోగాలని, మెలుగుతాయని ఆశాంశిస్తాను. కావ్యపఠనమున జ్ఞాన సముపార్జన, తద్వారా ముక్తిపొందుటకు మార్గము దొరుకుతుంది. భక్తివల్ల నేరుగా ముక్తి మార్గము దొరుకుతుంది. అందరికీ అందుబాటులో ఉండేది భక్తిమార్గము. అది మధురాతి మధురం. కైవల్య సాధనకు అంతకంటే మరొక సులభమార్గము లేదు. భక్తిమార్గము అజ్ఞానతిమిరాన్ని తొలగించి జ్ఞానకాంతిని ప్రసరింపజేసినట్లు యీ గేయమాలా మాణిక్యాలు రామాయణపు గని నుండి వెలికి తీయబడి భక్తి అనే వెల్లుగును ప్రసాదిస్తున్నాయి.

రాధాకృష్ణమూర్తిగారి కావ్యమునకు కథావస్తువు కవికోకిల వాల్మీకి విరచితమైనట్టిదియూ, భక్తిరసభరితమైన శ్రీ సీతారామచంద్రుల చరిత్రమే అగుటవలన ముక్తి మార్గమునకు దగ్గిర మార్గమునుచూపు కావ్యము. ఆదికవియైన నన్నయ, కవిబ్రహ్మ తిక్కన సోమయాజి, ఎఱ్ఱాప్రగడ భారతమును తెనిగించి తెలుగునాట కవిబ్రహ్మలై నుతికెక్కిరి. వీరు కథావస్తువును మాత్రమే మూలము

నుండి తీసుకొని, వాని కవితా ప్రతిభచే చక్కని కవితలల్లి కీర్తిగాంచిరి. ఏ కావ్యమునైనను పద్యమునగాని, గేయమునగాని, యథాతథముగా మూలమును అనువదించుట బహుదుర్లభము. వచనమున అట్టి శ్రమ లేదు. శ్రీ రాధాకృష్ణ మూర్తిగారు వాల్మీకి రామాయణమును యథాతథముగా తెనిగించుటకు బహు శ్రమపడినారనుటలో సందియములేదు. అనేక శ్రమలకోర్చి యీ కావ్యమును మాణిక్యమకుటములతో, మాణిక్య మాలలుగాచేసి, మానవాళి కందించి, మహోప కారముచేసిన మన రాధాకృష్ణమూర్తిగారు మాననీయుడు. మృదుమధురమైన వీరి గేయమాలంతో నిండిన పూర్తి రామాయణము అతిత్వరలో ముద్రితమై, ప్రజానురంజకమై, ప్రతీవానినోట పలుకునదై, మన రాధాకృష్ణమూర్తిగారు తెలుగు సాహిత్యంలో ప్రజాకవిగా ప్రసిద్ధి గాంచాలని నా కోరిక.

భావోద్రేకమున కావ్యప్రచురణకు, కవి సత్కారము చేయుటకు అనేకులు ముందుకు వస్తున్నారు. నిరాడంబరుడు, నిగర్వి, నిత్యరామపాద సేవాతత్పరు డైన రాధాకృష్ణమూర్తిగారికి అట్టివి రుచించకపోయినా అట్టి గౌరవములు పొందుట కర్హుడు. యీ మహా కావ్య ముద్రణమును చేపట్టి, కవి సత్కారమును చేయుటకు సంకల్పించిన శ్రీ చండిక సాంబశివరాజుగారు కడు ధన్యులు. నిత్య రామపూజా నిరతుడు, సుగుణఖని, సత్శీలుడు అయిన రాజర్షి సత్తమునిచే సత్కరింపబడుచున్న శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తి గారిని ''రాజకవి'' అనుట చాలా సమంజసము. కవికి, శ్రీ సాంబశివ రాజుగారికి, యీ కావ్యమును చదువు పాఠకులకు శ్రీ సీతారామాంజనేయ ప్రభువులు సదా యిష్ట కామ్యములు తీర్చి కాపాడుదురు గాత !

సీతారామ నిలయం
న్యూ దిల్‌సుఖ్‌నగర్.
3–11–1981

విధేయుడు
కనుమూరి పెద్దిరాజు
(దిల్‌సుఖ్‌నగర్ మారుతి మందిర్ ప్రెసిడెంటు)

# కృతజ్ఞతా కుసుమాలు

శ్రీరాముని అనుగ్రహంతో రామాయణంలోని మూడు కాండములు సుందర-బాల-కిష్కింధకాండములు పూర్తి అయినవి. అరణ్యకాండము ప్రారంభ మయింది. జీవితంలో కొంత తృప్తి కలిగింది. మిగిలిన భాగాలు పూర్తి చేయా లంటే పురాకృతపుణ్యం సరిపడవుంటే, స్వామి దయవుంటే పూర్తికావడం విశేషం కాదు. ఎందరో మహానుభావులు రామాయణ సారాన్ని అందించారు. వారందరికీ నమస్సులు. శ్రీ చండిక సాంబశివరాజుగారు ముందుండి వెలుగు చూపుతున్నారు. వారి అభిమానానికి ఎంతో కృతజ్ఞుణ్ణి. రామాయణ రచన చేస్తున్నాననే భక్తి, ఆనందంతో, రామసేవలో చిహ్నంగా నన్నొక కవిగా వారు తలంచి, వారి పేరుతోటి ఆ కవినామం జతపర్చి "రాజకవి" అన్న గౌరవం నాకు ఇచ్చారు. కవి గౌరవానికి నేను తగినంతవాడినికాను. అయినా రాజుగారు నాయందు చూపిన అభిమానానికి చిహ్నంగా, శాశ్వతంగా నిలిచిపోయే సందర్భం కాబట్టి రామానుగ్రహంగా భావిస్తున్నాను. మా గురువుగారన్నారు-రామాయణం వ్రాయటం ఒక రాజయోగం. అందువల్ల ఆ యోగం నీకు లభించిందని—

1978 లో సుందరకాండ వ్రాయటం ఆరంభమైంది. రామాయణ రథం సాగుతోంది దివ్యంగా. వ్రాయటం కాదు, అనేకచోట్ల అనేకమంది మిత్రులు గానం చేస్తున్నారు. ఎందరో పెద్దలు ఆశీర్వదిస్తున్నారు. ఒక సుందరబృందంగా తయారయి, ఎవరికి తోచిన భక్తి, శక్తులతో రామాయణ రథాన్ని ముందుకు తీసుకువెడుతున్నారు. దేముడున్నాడా? అన్న ప్రశ్నకు సమాధానంగా ఉన్నాడు అన్నట్లు జరుగుతున్నాయి సర్వమూ. శ్రీ కనుమూరి పెద్దిరాజు (దిల్‌సుఖ్ నగర్ మారుతిమందిర్ ప్రెసిడెంటు) గారితో పరిచయం కలిగింది. వారి ఆల యంలో కిష్కింధకాండము గానం చేయించారు. మొదటగా శ్రీ సాంబశివరాజు గారింట్లో గానం చేశాము. తరువాత దిల్‌సుఖ్‌నగర్ యూత్ అసోసియేషన్‌వారి పిలుపు శ్రీ మోదేకుర్తి వెంకట్రావుగారు, లలితానగర్, అందివ్వగా గణపతి నవరాత్రులలో గానం చేశాము. మూలాన్నే అనుసరిస్తూ వ్రాసినా అనుభూతితో వ్రాసిన కొన్ని గేయాలు మూలాన్ని పూజించే పూజాపుష్పాలు. తీపి ఎల్లా వుంటుంది అంటే సరిఅయిన సమాధానం తిని తెల్సుకోమనటమే. అలాగే రామాయణాన్ని చదివి, విని, ఆనందించవలసిందే. ఎందరో పెద్దలతో పరిచయం అయింది, వారు రామాయణాన్ని విశదపరుస్తుంటే పూర్తిగా రామాయణాన్ని అర్థంచేసుకోవాలంటే ఎంతో సంస్కారం కావాలనిపిస్తోంది నాకు.

ఈ కార్యక్రమంలో నాకు సహాయకారులుగా సుందర కాండమునుండి నన్ను ప్రోత్సహిస్తున్న శ్రీ రావూరు వెంకట సత్యనారాయణరావుగారు, శ్రీ కనుమూరి పెద్దిరాజుగారు, శ్రీ కృష్ణస్వామి నాయుడుగారు, శ్రీ నరహరిరావుగారు, శ్రీ యర్రాసత్యనారాయణగారు శ్రీ B S.R ఆంజనేయులుగారు శ్రీ S.S. లక్ష్మణరావు గారు, శ్రీ T. మల్లికార్జునరావుగారు, శ్రీ కందికొండ ప్రభాకరరావుగారు శ్రీ వంగూరి సుందరరామయ్యగారు మొదలయిన పెద్దలందరికీ నమస్సులు. నా సోదరులు శ్రీ సూరంపూడి వెంకట సత్యనారాయణగారు, చి॥ వెంకట రమణరావు చి॥ విశ్వేశ్వరరావుగార్లు నా కెంతో ప్రోత్సాహాన్నిస్తున్నారు. దీనిని గానం చేస్తున్న శ్రీ పతానేని రామచంద్రరావుగారికి. శ్రీ పేరి సుబ్బారావుగారికి నమస్సులు. శ్రీ కళ్ళే సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అమూల్యమయిన సంహాలిస్తున్నందుకు వారికి నా కృతజ్ఞతలు. శ్రీ C. N. బాబుగారు సోదరన్యాయవాది నా కెంతో ప్రోత్సాహాన్నిస్తున్నందుకు వారికి నా ధన్యవాదములు.

శ్రీ వర్ధమాని సోమసుందరంగారు, శ్రీ అక్కిరాజు రమాపతిరావుగారు నా గురువులు. వారి ఆశయం నా చేత పూర్తిగా రామాయణం వ్రాయించాలని. మరి అంతటి భాగ్యం పురాకృత పుణ్యం వుంటే కలగవచ్చు.

అడగగానే ఆవిష్కరణకు అంగీకరించి, ఆవిష్కరించిన గౌరవనీయులు, న్యాయశాఖామాత్యులు శ్రీ ఏరాసు అయ్యపురెడ్డిగారికి నా కృతజ్ఞతాభివందనములు. ముఖ్య అతిధిగా విచ్చేసిన గౌరవనీయులు శ్రీ అల్లాడి కుప్పుస్వామిగారు, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులకు నా కృతజ్ఞతాభివందనములు. శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయంలో ఆవిష్కరణ జరుపుకొనుటకు అవకాశం యిచ్చి ఆదరిస్తున్న అధ్యక్షులు శ్రీ అవ్వా సత్యనారాయణరావుగారికి నా నమస్సులు.

ఊహించనంత తొందరలో వాయువేగంతో, దీన్ని సర్వాంగ సుందరంగా ముద్రించి యిచ్చిన పద్మావతి ఆర్టు ప్రింటర్సు అధినేత శ్రీ శ్రీనివాసరావు గార్కి నా ఆశీస్సులు.

"నేనన్నది అసలేదీ లేదు- నాదన్నది నీ దయ వున్నదని"- సుందరకాండము వ్రాసేముందు నమ్మినాను. అదే జీవితాంతం నమ్ముతాను. భక్తితో పూసిన పూవులు. పెద్దలు సహృదయతతో ఆశీర్వదిస్తారని ఆశిస్తూ-

విధేయుడు

సూరంపూడి రాధాకృష్ణమూర్తి.



కుడినుండి-ముఖ్యఅతిథి : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి గా॥ శ్రీ అల్లాడి కుప్పుస్వామిగారు-ఆవిష్కర్త
ఆంధ్రప్రదేశ్ న్యాయశాఖామాత్యులు గా॥ శ్రీ ఇ. అయ్యపురెడ్డిగారు- శ్రీ రావూరు వేంకట సత్యనారాయణరావుగారు—రచయిత
వెనుక : శ్రీ టి. యస్. ఆర్. ఆంజనేయులుగారు- శ్రీ అక్కిరాజు రమాపతిరావుగారు- శ్రీ వర్ధమాని సోమసుందరంగారు-
౪ వ వరుస: శ్రీ సూరంపూడి వెంకట రమణారావుగారు- శ్రీ ఎం.ఎల్. నరసింహారావుగారు- శ్రీ పఠానేని రామచంద్రరావుగారు.



''రాజకవి'' బిరుదు ప్రదానము-కుడినుండి: శ్రీ చండిక సాంబశివరాజు గారు, ఎగ్జిక్యూటివ్, ఇంజనీయర్ పంచాయతీ రాజ్; ర
కావ్యగానం చేసిన శ్రీ పతానేని రామచంద్రరావుగారు. వెనుక : శ్రీ కనుమూరి పెద్దిరాజుగారు, శ్రీ సూరంపూడి వెంకటరమణారా:



కావ్యావిష్కరణ సభ

కుడినుండి :- ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి గౌ॥ శ్రీ అల్లాడి కుప్పుస్వామిగారు, ఆంధ్రప్రదేశ్ న్యాయశాఖా మాత్యులు గౌ॥ శ్రీ ఇ. అయ్యపురెడ్డిగారు, సభాధ్యక్షులు శ్రీ రావూరు వేంకట సత్యనారాయణరావుగారు, రచయిత, ముద్రణదాత శ్రీ చండిక సాంబశివరాజుగారు ఎగ్జిక్యూటివ్ ఇంజనీయర్ పంచాయతిరాజ్.



రచయితకు సన్మానము

కుడినుండి :- శ్రీ చండిక సాంబశివరాజుగారు ఎగ్జిక్యుటివ్ ఇంజనీయర్ పంచాయతిరాజ్, ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయమూర్తి గా॥ శ్రీ అల్లాడి కుప్పుస్వామిగారు.

# హనుమాన్ చాలీసా

## ప్రార్థన

అసమాన బలా అంజనిపుత్రా
మేరునగము నీ వజ్ర శరీరము
అసురులపాలిటి కాలుడ వీవు
అగ్రగామివి జ్ఞానము నందు.

సద్గుణ ఖని ఓ భక్తులధనమా
హనుమా వానరశ్రేష్ఠుడ వినుమా
నిలుమా నా హృది అనిలకుమారా
రాముని ప్రియతమ భక్తుడ రావా.

గోష్పదమును గావించు తీరున
వారిధి దాటిన దైత్యమర్దన
రామాయణ మను సుందరమాలకు
అందములొలికే కొలికి పూసవు.

ముకుళిత హస్తం వంచిన శిరసు
కన్నుల నిండుగ ప్రభువు రూపుతో
ముందర ఉందువు రాముని కీర్తన
ఎందు చేసినా మరి సందియమా ?

నీ చరణ కమలముల దివ్యరజముతో
మది పవిత్రముగ చేసి నిలచితి
బలమును బుద్ధిని విద్య యశమును
మా కొసగుమా ఓ కేసరి నందన.



జయహనుమంతా జ్ఞానసముద్రా
జయము నీకు ముల్లోకములందు
రామునిదూత అతి బలశాలి
అంజనిపుత్రా అనిలకుమారా

మంచిని పెంచి చెడునే త్రుంచే
వజ్రశరీరా విక్రమధీరా
స్వర్ణవర్ణము చెవికుండలములు
చక్కనివేషము సుందరజటివి ॥జయహనుమంతా॥

వజ్రకరమున ధ్వజము వెలయగ
మేనున సొగసుగ మౌంజియు నమరగ
శివాంశజాతా కేసరితనయా
జగముల వందన మందెడి తేజద

విద్యాఖని ఓ సుగుణ చతురుడా
రామకార్యమును, తీర్చగ ఆత్రుడ
సీతారాముల - సుమిత్రపుత్రుని
సతతము మదిలో నిలిపి స్తుతింతువు. ॥జయహనుమంతా॥

చిరురూపముతో సీతకు కనబడి
గురురూపముతో లంక కాల్చితివి
భీకరరూపుతో అసురుల త్రుంచి
రామకార్యమును తీర్చినవాడవు.

సంజీవినితో లక్ష్మణు కావగ
రాముని కౌగిటి భాగ్యము కలిగెను
ప్రభువుచేతనే ప్రశంసలందితి
సోదర భరత సముడవైతివి ॥జయహనుమంతా॥

వేయిరీతుల రాముడు పొగడెను
లక్ష్మీపతి తన కౌగిటి నిడెను
సనకాదులు బ్రహ్మాదిమౌనులు
నారద శారద ఆదిశేషులు

కాలుడు కుబేర దిక్పాలకులు
కవులు పండితులు అందరు పొగడిరి
రాముని మైత్రి రాజ్యభోగము
సుగ్రీవునికి కలిగించితివి. ॥జయహనుమంతా॥

నిన్ను నమ్మిన విభీషణాఖ్యుడు
లంకను ఏలుట జగమెరిగినదే
రెండువేల యోజనముల దూరము
ఎగిరి భానుని ఫలముగ గొనగ

ప్రభువు ముద్రికను నోటను దాచి
జలధి దాటగ అచ్చెరువేమది
జరగనివెన్నో నీ దయ వున్న
జరుగును జగమున అతిసులువుగను ॥జయహనుమంతా॥

రాముని చేరెడి మార్గము నిడెదవు
నీ దయలేక రాముడందదు
నిను శరణంటే సుఖములు కొదవా
రక్షకుడవు నువు భయమసలెందుకు

నీ తేజము నువు భరించువాడవు
నీ గర్జనకే వణకు లోకములు
భూతప్రేత పిశాచ గణములు
నీ జయనామము విని హడలును కద ॥జయహనుమంతా॥

ఆధి వ్యాధులు అన్ని పీడలు
తొలగును నిరతము నిన్ను తలంచిన
మనసున-మాటల-ధ్యానమునందు
నిన్నే నమ్మిన సంకటహరణము

ఎన్నిక రాజు-మునులకు ఏలిక
రామచంద్రునికి నమ్మినబంటువు
అన్ని అభీష్టము లింపుగ తీరును
సొంపుగ నీ గుణ గానముచేసిన ॥జయహనుమంతా॥

నాలుగు యుగముల నీ ప్రతాపము
నిలచును నిరతము జయహనుమంతా
సతతము సాధుల రక్షణ చేతువు
రామదూత ఓ - రాక్షసహరణా

అష్టసిద్ధులకు నవనిధులకును
దాతవునీవు - మాతవరము కద
రామసుధా మధువన్నది నీదే
రాముని దాసుడ వంచే నీవే. ॥జయహనుమంతా॥

నిను తలంచుటది రాముని సేవ
జన్మజన్మలకు దుఃఖహరణము
శ్రీపతి భక్తులు ఎచట పుట్టినా
చేరుట చివరకు రామపాదములు

అన్యదైవముల తలచక నిన్నే
కొలచుట సౌఖ్యములన్ని పొందుట
బలవిక్రమ సంపన్నుడ వగు నిను
స్మరియించిన హరియించు పీడలు ॥జయహనుమంతా॥

జయహో - జయహో జయహనుమంతా
కృప జూడుమయా ఓ గురుదేవా.
నూరుమార్లు మది పఠించినంతనె
బంధములన్నీ తొలగి సుఖమగు

ఎవరు చదివినా స్వామి చాలీసా
సిద్ధికలుగు శివశక్తుల సాక్షిగ
తులసీదాసు - హరికేదాసు
స్వామీ నా హృది నీ మందిరము.

జయహనుమంతా జ్ఞానసముద్రా
జయము నీకు ముల్లోకములందు.

హనుమ పాదములె మనకు శరణము
హనుమ స్మరణమె మనకు కరణము
హనుమ ధ్యానమె మనకు తరణము
హనుమ చింతనమె సంకట హరణము.

మంగళమయ్యా మారుతపుత్ర
మంగళమూర్తీ, మంగళమిదిగో
సుందరమూర్తీ శుభ మంగళము
అందుకొనుమిదే నిత్యమంగళం.



# విషయసూచిక

శ్రీ గణేశాయనమః

శ్రీ రామచంద్రాయనమః

# కిష్కింధ కాండము

## సర్గము. 1

### పంపసోయగము–సీతాదేవికై శ్రీరాముని ఆవేదన

శ్రీ రఘురాముని రమ్య చరితము
మారుతి రాముని సందర్శనము
సీతాసతికై అన్వేషణము
కపులసేవ కిష్కింధ కాండము.

సతితో వనమున సాగెను రాముడు
పితృవాక్య పరిపాలన ధీరుడు
శీలసంపద కలిగిన జానకి
అపహరింపబడె ఆ వనమందు.

అన్వేషించుచు ఎంతో కుములుచు
ఆ వనసీమను రామచంద్రుడు
శాపముతీరిన కబంధు పలుకున
ఋష్యమూకము చేరవచ్చెను.

ఋష్యమూకమున సుగ్రీవునితో
మైత్రిచేసుకొని అతని సాయమున
సీతాన్వేషణ జరుపుట సరియని
చేరెను దశరథరాముడు అచటికి.

॥శ్రీరఘురాముని॥

అడుగుజాడలో తమ్ముడు నడువగ
అడుగిడె పంపా తీరముచెంత
కమలము, కలువలు మీనములుండి
శోభించినవా పంపాజలములు

మనోహరమ్మగు నదీజలములు
మనసుహాయినిడు సుందరవనము
మరిమరి గాంచిన రామచంద్రుని
మనసున నిండెను సీత తలంపులు.

ప్రకృతి అంతా శోభామయమై
కలవరపరచగ దుఃఖతప్తుడై
ధరణీనందన తలపుల నిండగ
తమ్మునితో దాశరథి పలికెనిటు.

''వికసిత కమలములవి గను లక్ష్మణః
ఎర్రని కలువలు చూడు సరస్సున
వైడూర్యమ్ముల కాంతితో జలము
ఒడ్డున నిలచెను పలువృక్షమ్ములు.

శిఖరమ్ములతో శోభిలుగిరివలె
సరసుశోభిలె తరుసంపదతో
భరతునిభక్తి-సతిఅపహరణ
తలచితలచి నే కుములుచుంటిని.

తాపహరమ్ములు శీతజలమ్ములు
వేసట నణచెడి కాసారమ్మిది
అయినాకానీ వసంతశోభ
మనసు కలంచెడు మధన పెంచెడు.

॥శ్రీరఘురాముని॥

చిక్కగపరచిన పచ్చికనేలను
చక్కనివన్నెల పూలురాలగా
రత్నకంబళులు రచించినట్టుగ
శోభిలుచున్నది నేల అంతయు.

నిండుగవిరిసిన తరువులన్నిటిని
దండిగపూసిన పూలతలెంతో
మురిసిపోయిమరి కౌగలించినటు
పెనవేసినవి చూడుము సోదర !

సుమగంధముతో వీచెడిగాలుల
ఫలపుష్పముల శోభలుకలిగిన
మన్మథుసాయము పొందినవాడగు
వసంతుడెంతో ప్రకాశించెను.

మేఘము జలములు కురియునట్టుగా
తరువులుకురిసెను పూలవృష్టిని
పూచినశాఖల నూపుచుపవనుడు
తుమ్మెదలోయన రాగముతీసెను.

నిండినపూల శాఖలు కదలగ
పంచమస్వరముల కోయిల లన్నటు
పాడుచు గుహలను వదలినట్టుగా
తోచెనుపవనుడు రమ్యముగాను.

శ్రీగంధమువలె చల్లనివాడు
మందానిలుడు సుమగంధముతో
సుఖమగుస్పర్శను కలగజేయుచు
తిరుగుచుండెను సోయగమెగసెను.

॥శ్రీరఘురాముని॥

కొండచరులలో పుట్టిన తరువులు
విరగబూసి అవి కలసిపోవగా
పూలరాశివలె గిరులన్నియును
తోచెనుకనులకు పండుగచేసెను.

విరసినపూల తరువులపైన
నిలచినతుమ్మెదలన్నియు గాలికి
పైకిలేచి మరి ఎగురుచునుండగ
నల్లనిముసుగై తోచె తరువులకు.

నిలువుగపూచిన గోగులు - పూలతొ
బంగరు, వెండి వల్లెవాటులు
ధరించినిలచిన తరుణీమణులన
శోభిల్లినవి ఈ వనసీమలొ

ఈ వసంతపు శోభలన్నియు
క్రొత్తపులుగుల, రవములునిండి
సతికిదూరమై నిలచిన నాకు
తీరనివేదన పెంచుచున్నవి.

భార్యకుదూరము నున్న బాధను
సుమశరుడెంతో పెంచుచుండెను
కోయిలలన్నీ నీటికోళ్లు మరి
మధురస్వనములతో పెంచెను వేదన

పంచవటీతటి ఆశ్రమమందు
మనోహరమ్మగు పక్షులకిలకిల
వినుమనిచెప్పుచు మురిసిపోయెడిది
జానకిప్రియముగ ఆలకించెడిది.

॥శ్రీరఘురాముని॥

మక్కువనిండి మనసు పెంచుకొని
మన్మధువశమున చిక్కినపులుగులు
జంటనుజేరి తుమ్మెదగానము
వినుచుముదముతో కలసిపోయినవి.

అశోకతరువుల పూలునిప్పులై
తుమ్మెదరవము చిటపటుధ్వనిగా
ఎఱ్ఱచిగురులు జ్వాలలపోలి
వసంతాగ్ని నను దహించుచున్నది.

మనోహరమగు కోకిలస్వనములు
చక్కగపూసిన వసంతశోభలు
జానకికెంతో సంతోషమునిడు
జానకిలేక నే మనదగునా?

విరివిగపూసిన పూపొదలన్ని
కనవచ్చునని నేనెటుచూచిన
కానీ, జానకి-చకోరలోచన
కనరాకున్నది మరునికిచిక్కితి.

రెపరెపలాడుచు గాలులువీచెను
స్ఫటికద్వారములు తెరచినయట్టుల
పురులువిప్పినవి పెంటి నెమళ్లు
పరవశించినవి మగనెమళులిట.

కోరికపెరిగి మన్మధువశమై
ఆడునెమలి తన భర్తనుచేరి
నిండు మనసుతొ మగనిచూచుచు
పరిహసించునటు చూచెను నన్ను.

॥శ్రీరఘురామ॥

ఈ మగ నెమలి ప్రియతమ సతిని
ఏ రక్కసుడు - కాననమందు
అపహరించి, మరి దాచలేదు, అని
ఆనందముతో, ఆటల తేలెను.

వసంత శోభల ప్రభావమిది కద
పులుగులు జంటను చేరుచున్నవి
రావణాసురుడు అపహరించనిచొ
మైథిలి నా జత బాయకుండెడిది

విరసిన పూవులు-ఎగసిన తేనెలు
పులుగుల మనసగు - పిలుపులన్నియు
సుమశరు తీవ్రత పెంచుచున్నవి
దాటుట నేనెటు ఈ వసంతము

సీత కూడ ఈ వసంత శోభల
వికారమ్మును అనుభవించును
కానీ, అసురుల చేతికి చిక్కిన
కోమలి మనసున శాంతి నిలచునా ?

అప్పటి రాముడ నేనే అయినా
ఆ మారుతమే ఈ మారుతము
అయినా, అప్పుడు చల్లని హాయి
జానకి లేక అదియే జ్వాల

పంచవటిని మాకశుభ సూచనగ
ఆకాశములో కాకి కూసెను
ఇప్పుడు శుభము తోచునట్టుగ
చెట్టుకొమ్మపై కూయుచున్నది

॥శ్రీరఘురాముని॥

మనసు నిండిన ప్రియురాలిని తన
మగడు వెనుకబడి పోవునట్లుగ
గాలికి కదలెడు పూలగుత్తిని
చేరగ, తుమ్మెద సాగుచున్నది.

మన్మధు బాణము అశోక గుచ్ఛము
గాలికి కదలి మీదకు ఒరిగి
కొట్టునొ ఏమో అన్నటు తోచెను
కోమలి లేక సుఖమది లేదు.

కాంతులు నిండి ప్రకాశించెడు
నిండుగ పూసిన మామిడిచెట్లు
చందనాదులు చక్కగనలదుకు
మనిషిగ తోచెను మధుర స్పందనతొ

చక్రవాకములు హంస బెగ్గురులు
లేత సూర్యుని కిరణములన్నటు
తుమ్మెదలెన్నో కమలమ్ములపై
ఱెక్కలతో ఈ నీటిని కదపగ.

మనోహరమ్మగు వనమను వస్త్రము
కప్పుకున్నటు తోచుచు పంప
లేళ్లగుంపులు దంతిగుంపులతొ
నయనానందము కలిగించును కద.

సీతకు దూరము అయి బ్రతుకుటది
భూమికి భారము అగును లక్ష్మణా!
కుటిల బుద్ధితో సుమశరుడిపుడు
సీత తలంపులు నింపెను మదిలో

॥శ్రీ రఘురామని॥

మన్మధుడొకడన భయమదిలేదు
కానీ, తోడుగ వసంతుడుండగ
శత్రువుకెంతొ బలము కలిగినది
నేనిలుచుటకు కష్టము కలిగెను.

తామర మొగ్గల రేకుల చూచి
ఆనందించగ మనసు కలుగగ
సీత నేత్రములు తోచె తామరలొ
తీయని బాధ కలచెను మదిని

చల్లని గాలి వీచెను హాయిగ
కానీ, పవనుడు పద్మసుగంధము
తీసుకువచ్చి నన్ను తాకగ
తోచును అది నా సీత శ్వాసమై.

పంపానదికి దక్షిణ దిశలో
ఇంపుగ పూచిన గోగులు చూడుము
పర్వతరాజుకు అలంకారములు
విరియబూసుకొనె కొండచరియలు.

మాలతి, మాధవి, మల్లిక సోకులు
అశోక, సంపెగ, కేతకి సొగసులు
చూత, శింశుప, దిరిశెన శోభలు
వకుల, కురంట, పాలివి, శాబర

నాగరంగములు నారంగములతొ
పచ్చని పొదలు విచ్చిన పూలతొ
సోయగమొలకెను పంపతోయములు
శోభలీనినది పంపాతటము.

॥ శ్రీరఘురాముని ॥

గాలికి కదిలిను తరువుల శాఖలు
ముదముగ ముందుకు వచ్చుట తోచగ
మదవతులన్నటు సుమలతలపుడు
మత్తుగ కౌగిట చేర్చె తరువులను

క్రొత్తగ విరిసిన పూవులపైన
పొంగిన వెచ్చని తేనెల రుచిని
చూచుచుసాగెడి తీరుగతుమ్మెద
ఝుంకారముతో ఎగసెను సుమముల.

పోటీపడినటు తరువులు పూసెను
చీటికి మాటికి తగువాడినటు
తుమ్మెద ఝుంకారమ్ముల వంకతో
సాటి తరువులలో హేళన సాగెను.

సతితో కూడిన కారండవము
జలకాలాడెను పంప జలముల
మందాకినికీ పంప అందము
అందెను; అందుకు ప్రసిద్ధికెక్కెను.

కన్నులముందు సీతయుండిన
పంపకు చేరువ నుండుట కలవడి
స్వర్గసుఖములు, అయోధ్య నగరము
స్మరణకురావు సుమిత్ర తనయా !

లేత చిగురులు మొగ్గలు నిండి
నిండుగ పూసిన పూవులతోను
ఈ వన శోభ, లలనామణిని
తలపుల నింపి మనసును కలచెను

॥ శ్రీరఘురామునీ ॥

జంటగ తిరిగెడి జింకలన్నియు
ఒంటిగనున్న నా మదికెంతో
ఆనందముతో కలిపి దుఃఖమును
అందించినవి మెసెరడి కన్నుల.

పావన పంపా తోయములందు
పవనుని చల్లని గాలుల యందు
పావని సీతతో కలిసి తిరిగిన
తనువున నిలుచును ప్రాణము నాకు.

ఆ కమలాక్షి నవయవ్వనవతి
ముఖము పోలును నిండు చంద్రుని
నా వియోగమున తనుమనగలదా!
ఏ విధి ప్రాణము నిలుపును తనువున.

నే వియోగమును సహించియున్నను
అవమానము నను బ్రతుకనీయదు
అంతటి జనకుడు ధర్మశీలుడు
జానకి ఎచటని అడిగిన ఏమగు?

కన్నతండ్రికై కానకు రాగా
సహధర్మిణి నను అనుసరించెను
కానీ, నన్నే నమ్మిన సతిని
కావగలేని కృతఘ్నుడను కద!

రాజ్యహీనుడై దైన్యము నిండి
నిర్భాగ్యము అది ముందు నడువగా
జంట విడక నా వెంట వచ్చిన
సీత లేక నా ప్రాణము నిలచున?

॥శ్రీరఘురామునికి॥

ముద్దులొలుకు నా సీత ముఖమును
సల్లాపములను, పలికెడి పలుకులు
తిరిగి నేను మరి కాంతున సోదర?
నా కంతటి అదృష్టము అమరున?

అయోధ్య కేగగ అమ్మ వచ్చినను
కోడలు ఏదన? ఏమని చెప్పను
అడవిలొ అసురుడు అపహరించెనని
చెప్పుట తగునా? ప్రాణములుండున?

కావున లక్ష్మణ ! పొమ్మిక నీవు
నే నట వచ్చుట జరుగదు వినుము
భరతుడు సోదర ప్రేమకు నిలయము
సోదర ప్రేమతొ మెలగుడు మీరు''

అనుచు పలికిన అన్నను గాంచి
సమయమునెరిగి సుమిత్రతనయుడు
మంచి మాటలు ధైర్యోక్తులతొ
రామచంద్రుని ఊరడించెను.

''ధైర్యము పూనుము ఓ దాశరథీ !
శోకము వదలుము అన్నా ! రామా !
ధీరసత్తముడవైన నీ విటు
దీనుడవై మాటాడుట తగదు

స్నేహమువలన దుఃఖము కలుగును
దానిని మరచిన శోకము తీరును
స్నేహమువలనే నీట తడసినా
వత్తిమండును చమురు స్నేహమున

॥శ్రీ రఘురామునకు॥

కానీ, వదిన తలపులు మరువగ
నుడువుట కాదు నా ఆలోచన
కర్తవ్యము భూజాతను వెదకుట
దాచిన చోటు మనకు తెలిసెనన

చోరుడు భయమున, చేర్చెను మాతను
లేదా పాతాళములో నున్నను
ఇంద్రుని తల్లి ఉరమున దాగిన
అంతము చేతును! వదలను చోరుని.

శోకించుటది మొదటి విషయము
శోధించుటది రెండవ విషయము
ప్రధానమయినది రెండవదయిన
దానికి కావలె ధైర్యము రామా !

ఉత్సాహమును వదలకుమయ్యా !
అదియే బలము మనకది శక్తి
ఉత్సాహముతో నిలచిన మనకు
ఏ విఘ్నములు ముందు నిలవవు.

మహాత్ముడవునువు కోవిదుడవు కద !
నిన్ను నువ్వు మరి తెలియకపోయిన
నే చాలుదునా నీకు చెప్పుటకు
శోకము వదలుము మాతను వెదుకగ''

తమ్ముని పలుకుల దైన్యము వీడెను
కర్తవ్యమ్మదితోచెను మనసుకు
మత్తేభములై నిర్భయమ్ముగా
సాగిరి ముందుకు ఉత్సాహముతో.

॥శ్రీ రఘురాముని॥

## 2. రామ లక్ష్మణుల గాంచి సుగ్రీవుడు భయపడుట.

ఋష్యమూక గిరి దాపులయందు
సుర విక్రములు సుందర రూపులు
రామ లక్ష్మణుల గాంచిన యంత
సుగ్రీవుని మది తల్లడిల్లెను.

వాలి పంపగా చంపుట కొరకై
వచ్చినారు ఆ వీరులనుచును
వానరులందరు కలతజెందిరి
దాగిరి మతంగ ఆశ్రమతావున

సుగ్రీవునిమది కలవరమందెను
ధైర్యము చెదరెను పదములు నిలువక
ఆపదతలచి స్థిమితము తప్పి
పరుగిడ దిక్కుల నరయ సాగెను.

తాపసులైనా శరములున్నవి
మతంగ శాపము వీరికి లేదా?
వాలి పంపగా వచ్చిర వీరు
వీరుల చూడగ ప్రాణములూడును.

పారిపోయినా వాలి చంపును
ఆగిపోయిన వీరు చంపెదరు
అసలు విషయము తెలుసుకురండని
సుగ్రీవుడు తన సచివుల కోరెను.

విల్లంబులతో దర్శనమిచ్చిన
వారిని చూచి వానరులందరు
భయపడిపోయి వడిగా గెంతుచు
చేరిరి సుగ్రీవుని సన్నిధికి.

॥శ్రీ రఘురాముని॥

వాయునందనుడు ముందుకు వచ్చి
వానర రాజుతో పలికె తీరుగా
''ఋష్యమూకమును వాలి చేరునా?
తెలివిగ జూడుము ఏదీవాలి?

భయముతో నీవు కపిలక్షణము
కనబరచితివి, భీరువుగాకుము
ధైర్యము వీడి ఆలోచింపక
ఏలుట ఎట్లు వానర రాజ్యము?

ఆలోచింపక ఏ పనిచేయకు
ఎదుట వ్యక్తి మదిగ్రహించ నేర్వుము''
అనుచు హితవును శుభమును పలికిన
వాయుపుత్రునితో పలికె రవిసుతుడు.

''హనుమా ! వినుమా, వీరులిద్దరు
కమలనేత్రులు ఆజానుబాహులు
ధనుర్బాణములు కలిగినవారై
దేవకుమారులవలె వెలుగుచును.

వాలి పంపగా వచ్చియుందురు
రాజుకు మిత్రుల కొదవ కలుగునా?
శత్రుని మిత్రులు అదను జూచుకొని
అంతము చేతురు-రాజధర్మ మది.

వాలి అనిన సామాన్యుడుగాడు
ఉపాయ మెరుగును అపాయ మెరుగడు
విషయము తెలియగ నీవే పొమ్ము
సామాన్యునిగా వేషము దాల్చుము.

॥శ్రీరఘురాముని॥

ఆకారములు ముఖ కవళికలు
మాటలు వాటితొ మనసు తెలియుము
వంచన బుద్ధి కలిగినవారో
శుద్ధ మనస్కులొ తెలియుము నీవు.

ముందుగ నీవు ముచ్చటలాడి
నమ్మకమన్నది కల్పించుకొని
ఆపై వారి వివరములడుగుము
శరచాపముల సంగతి తెలియుము.

నిర్మలమైన మనసుతొ వారు
ఉన్నటు నీవు గ్రహించినంతనె
సత్యాసత్యము తెలియుము మరల''
అనగా మారుతి సరియని పలికెను.

॥శ్రీరఘురాముని॥

## 3. హనుమంతుడు రామలక్ష్మణులతో సంభాషించుట.

వానర రూపము వీడెను మారుతి
తేజము నిండిన భిక్షు రూపమున
రామ లక్ష్మణుల చెంత చేరెను
అతి నమ్రతగా వందన మిడెను.

వినయము నిండి పలికెను మారుతి
వివరములడిగెను వినసొంపుగను
''అయ్యా ! మీరు దేవసమానులు
రాజ ఋషులుగా అగుపడుచుండిరి.

ఈ వన సీమల కేలవచ్చితిరి
మీరు తిరిగెడి స్థలములు కావు
మంచి వ్రతము చేపట్టినవారు
పులుగులు, మృగములు భయపడుచున్నవి

మేని కాంతితో పంప మెరసెను
మాన్యులు మీరు ప్రాయము నుండిరి
కేసరి చూపులు కలిగినవారు
మృగ రాజంతటి బలమగువారు.

బంగరు సింహాసనము నందున
ఉండగ తగిన రాజవరేణ్యులు
ఇంద్రచాపము పోలిన ధనుసులు
కరి తొండముతో సరిపడు భుజములు.

నడచి అలసి యానిట్టూర్పులవి !
జడలు ధరించి తిరుగుట ఏల?
మీ యోగ్యతకు కనబడు స్థితికి
పొంతన కుదరదు ఎందుకు స్వామీ !

విశాల వక్షస్థలముతో మీరు
వనమున తేజము నింపినారయా !
నింగి విడచి ఈ నేలను చూడగ
దిగినయట్టి రవి చంద్రుల మీరు?

పరిఘల పోలిన హస్తములుండి
గుంద్రగ బలమును తెలుపుచున్నవి
ఆభరణమ్ములు ధరించలేదు
కారణమేమో తెలియకున్నది.

॥శ్రీరఘురామునికి॥

అడవులు - జలధులు నిండిన భూమిని
వింధ్యాచలముతో శోభిలు ధరణిని
పరిపాలించగ చాలిన వీరులు
దీనత నుండగ కారణమేమి ?

మీధనుస్సులు నిగనిగ మెరయుచు
గంధాదులతో బంగరు పూలతొ
పూజలనంది తేజము నిండెను
ఇంద్రుని వజ్రాయుధమును పోలును.

అమ్ముల పొదులవి పగవారలకు
ప్రాణముతీయు సర్పములన్నటు
పోలిన శరముల నిండియున్నవి
నాడెమైనవి శుభకరమైనవి.

మిక్కిలినిడివి వెడల్పుగలిగి
భయము గొలుపుచు మెరసే కత్తులు
కుబుసము విడచిన సర్పముపోలి
ఉన్నవి-రిపులకు కలలోమెదలును

బదులిడకుండిరి కారణమేమి?
నా వృత్తాంతము తెలిపెద నార్యా!
ధర్మాత్ముడును కపులకు రేడు
సుగ్రీవుడను కపికలడిచట.

అన్నచె ఆతడు తరిమివేయబడి
దేశము తిరుగుచు ప్రాణ భయమున
అతి బాధలో అతడుండెను స్వామీ!
వచ్చితినేను ఆతడు పంపగ

॥శ్రీరఘురామునకు॥

సుగ్రీవునికి సచివుడనేను
హనుమంతుడను వాయుపుత్రుడను
కోరిన రూపము దాల్చగనేర్తును
కోరిన స్థలముల తిరుగగ చాలుదు.

చెలిమిని కోరి మా సుగ్రీవుడు
పంపెను నన్ను" అని పలుకగను
ముదమునంది శ్రీరామచంద్రుడు
తమ్మునితోను తీరుగపలికెను.

"సోదర ! సామాన్యుడు కాడితడు
ఘనమతి సుగ్రీవుని సచివుడయా !
వెదకెడివాడే ముందు నిలచెను
ఇతనిలో అతనిని చూడగతగును.

లక్ష్మణ ! యిమ్మ ప్రత్యుత్తరము
శాస్త్రము లెరిగిన ప్రజ్ఞావంతుడు
అతనికి తగినటు తిరిగి పలుకనిచో
తలచును మనలను అపండితులుగ.

ఋగ్, యజు స్సామ వేదములు
శిక్షా వ్యాకరణమ్ములన్నియు
త్రికరణశుద్ధిగ నేర్చినవాడే
పలుకగ నేర్చును యీ విధముగను.

స్వచ్ఛమైన ఉచ్చారణతోను
అప శబ్దమ్ములు అసలే లేక
ముఖమున కన్నుల లలాటంబున
తనురోమములందు దోషములేదు.

॥శ్రీరఘురామునికి॥

వ్యర్థ పదములు వెదకిన దొరకవు
సందిగ్ధమునకు తావేలేదు
తొందరలేదు మాటలయందు
మాటపెగలని తీరులు లేవు.

మధ్యమస్వరమున వ్యాకరణముతో
శుద్ధమయిన వాక్చాతుర్యముతో
కత్తినెత్తిన శత్రువయినను
కొట్టుకుపోగల వాక్ప్రవాహము.

ఏ రాజయినా యింతటి మంత్రిని
పొందకున్న మరి కీర్తి గడించున?
తలచిన కార్యము తీరుగనడచున?
సఫలీకృతుడగు ఇట్టి దూతచే

ధరణినేలగా తలచిన రాజు
ఈ విధమైన దూత కోసమై
తనుగా చూచుట యుక్తమైనది
సర్వము జరుగును నిర్విఘ్నముగ''

అన్న పలుకులు వినిన లక్ష్మణుడు
వాక్యకుశలుడు పలికెతీరుగా
''పండిత శ్రేష్ఠా! వింటిమి మేము
మీ సుగ్రీవుని నామధేయము.

రవిసుతుగుణములు ప్రభావమ్మును
వింటిమి మేము-నీవు నుడివినటు
చేయుటకొరకై సిద్ధము నుంటిమి
సిద్ధించును నీ కోరిక హనుమా!''

॥శ్రీరఘురామున్॥

అనగా వినిన వాయునందనుడు
సుగ్రీవునికి జయమును కోరుచు
రామ సుగ్రీవుల చెలిమిని బలముగ
కూర్చ నెంచెను సంతోషముతో.

## 4. రామానుజుడు హనుమంతునితో తమ వృత్తాంతము తెలుపుట.

సుగ్రీవునిగన వచ్చిన వీరుల
రామ లక్ష్మణుల కాంచిన మారుతి
తలచెను మదిలో రవిసుతు కార్యము
జరుగును తప్పక వీరి వలననే.

మారుతి పలికెను రాముని చూచుచు
"అయ్యా ! నీవు తమ్మునితోను
ఈ వన సీమల తిరుగుట ఏల?"
తమ్ముడు బదులిడె అన్న ఆనతిని.

"ద్యుతిమంతుడును తేజోవంతుడు
దశరథ భూపతి ధార్మిక శ్రేష్ఠుడు
ధనధాన్యములతో యజ్ఞయాగముల
రెండవ బ్రహ్మయి పురమునేలెను

ఆయన జ్యేష్ఠ కుమారుడు రాముడు
పరాక్రమమున ప్రసిద్ధి గాంచి
సర్వభూతముల రక్షణ చేయగ
చాలిన యోగ్యుడు ఈతడు హనుమా !

॥శ్రీరఘురాముని॥

పితృవాక్య పరిపాలన చేయగ
రాజ్యమువదలి కానలనడచెను
నడచెను భూసుత సీతాదేవి
భర్తతో-సాయంసూర్యకిరణమై.

రామచంద్రునకు సోదరుడను నే
అనుసరించితిని అన్న పదముల
సేవలుచేసి జన్మతరించగ
సేవించెద నా అన్నను హనుమా !

లక్ష్మణుడది నా నామధేయము
కృతజ్ఞుడు మరి సుఖపడసిరిగల
జీవుల రక్షణ చేసెడి రాముడు
రాజ్యము వదలి కానల కదలెను

కాననమందు రామచంద్రుని
సతియగు సీతను కామరూపియగు
రక్కసుడెత్తుకు పోయి దాచగా
వెదకుచు మేము తిరుగుచుంటిమి.

శాపవశముచే దానవుడయిన
''దను''వనువాడు సీతను వెదుకగ
సాయము చేయును రవి సుతుడనుచు
సూటిగ జెప్పెను నిజము కపీంద్రా !

జనుల పొగడ్తల నందిన రాముడు
దానగుణముచే శోభిలు రాముడు
అతనికి ఇపుడు మీ సుగ్రీవుడు
అండగ నిలచెడి దిక్కు కపీంద్రా !

॥శ్రీరఘు రామ॥

దీనరక్షకుడు ధర్మరక్షకుడు
దశరథ భూపతి కుమారుడితడు
తండ్రికి తగిన తనయుడు అయినా
సాయము వేడగ వచ్చె రవిసుతుని.

భూతల మందలి జీవికి సుఖములు
అనుగ్రహించే ప్రభువగురాముడు
వినయముగా మీ వానరరాజు
అనుగ్రహమ్మును కోరుచుండెను.

సద్గుణ సంపద కలిగినవాడు
రాజలోకమున పూజ్యుడు అయిన
ఉత్తమదాత దశరథతనయుడు
కపిరాజును తను శరణుకోరెను

సత్కీర్తికి మా అన్నయె నెలవు
అంతటివాడు శోకవశుడయి
దిక్కని వేడెను మీ సుగ్రీవుని
దయతోనతడు చేర్చగనగును.''

అని పలుకుచును కన్నులనుండి
అశ్రుధారలు కురియు లక్ష్మణుని
చూచిపలికెను వాయునందనుడు
ఊరడించెను మృదువచనముల.

''విజితేంద్రియులు విక్రమమూర్తులు
సదాచారులు సజ్జనపూజ్యులు
మిమ్ముగనుట మా రాజు భాగ్యము
రవిసుతువివరము తెలిపెద వినుడు.

॥శ్రీరఘురాముని॥

అన్న వాలి మా రాజు భార్యను
అపహరించి మా తేనిని తరిమెను
అడవులబట్టి తిరిగెడిరాజు
అండగనిలచును తనకపిసేనతో''

అనుచు తియ్యగా పలికి మారుతి
సుగ్రీవుని కడకేగగ రమ్మని
లక్ష్మణమూర్తితో పలుకగనంత
పవనతనయుని పొగడె లక్ష్మణుడు.

''అన్నా ! యీ కపిశ్రేష్ఠుడు నిజమును
పలుకుచుండెను సుగ్రీవునికి
నీతో కాగల కార్యమున్నది
నీ కార్యము నెరవేరినదనుకొను.

ప్రసన్నమయిన ముఖకవళికలు
ప్రియము గూర్చెడి హితవచనమ్ములు
సాధుస్వభావము వినయసంపద
మోసము లేదని తోచుచున్నది.

కావున మనము వానరేంద్రుని
చూడగపోదము'' అనగా రాముడు
సరియని పలుకగ వానరశ్రేష్ఠుడు
కపి రూపముతో నిలచె వినయముగ.

రవిసుతు కార్యము నెరవేరినదని
సంతసమంది రామలక్ష్మణుల
నిరువుర చేర్చగ రవిసుతుముందు
భుజముల నిడుకొని తృటిలో చేరెను.

॥శ్రీరఘురాముని॥

# 5. శ్రీరామ సుగ్రీవ మైత్రి.

రామలక్ష్మణుల నిరువురనపుడు
ఋష్యమూకగిరి సుఖముగ చేర్చి
సుగ్రీవునితో పలికెను మారుతి
రాఘవు ఘనత తెలిపెను తీయగ.

"సూర్యతేజుడు రామభద్రుడు
మతిమంతుడు తన తమ్మునితోను
నిన్ను చేరగ వచ్చెను ఘనుడు
రవికులతిలకుడు, సూర్యకుమారా!

ఇంద్రుని గెలవగ తేజోవంతుడు
దశరథసూనుడు ధర్మ నిరతుడు
పితృవాక్యపరిపాలనదక్షుడు
సతితో వనమున గడుపుచుండగా.

రావణాసురుడు రాముని సతిని
అపహరించెను విను-మహరాజా!
ధరణినంతను కీర్తిగడించిన
దశరథతనయుడు రక్షణ కోరెను.

పూజ్యులలోను ఉత్తములయ్యా!
భాగ్యము నీదని మదికో తలచుము
నెయ్యము కోరి వచ్చిరి వినుము
పూజలుచేసి పుణ్యమునందుము"

పావని పలుకుల ముదమును పొంది
మదిలో భయము తొలగిపోవగా
మనుజ రూపమున త్వరగా వచ్చెను
మనుజోత్తములను సందర్శించగ

॥శ్రీరఘురామున॥

ధర్మగుణముతో రాజిలువారు
సర్వభూతముల వ్యాపకులనుచు
మారుతి పలికిన పలుకులు వినిన
రవినుతుడనెను దాశరథులతో.

"మానవ లోక పాలకులారా !
మీరు నెయ్యము కపితో చేయగ
ముందుకువచ్చుట నా భాగ్యమది
నే కృతకృత్యుడ ! అయినా వినుడు

నాతో చెలిమి చేయగ మీకు
నిండుగ సమ్మతి అయినచోనిపుడు
నా చేతితో నీ చేయి కలుపుము
నే చాచితినిదె కరము వినయముగ."

రాముడు మదిలో సత్యము నెరిగి
మనసునిండుగా కరమును కలిపి
మానవోత్తముడు-కపికులోత్తముని
కౌగలించుకొని గుండియ కలిపెను.

పవనతనయుని మదిపులకించెను
చంద్రపుల్లలతో అగ్ని రగిల్చెను.
అంతట మిత్రులు హుతవాహునికి
పూజనుచేసి ప్రదక్షిణించిరి.

రామ సుగ్రీవులు అగ్నిసాక్షిగా
స్నేహము నెరపి తమ కార్యములు
తీరినట్టుగా సంబరపడుచు
తృప్తిగ చూపులు పంచుకొనిరట.

॥శ్రీ రఘురామునకు॥

ఆనందముగా స్నేహితులిరువురు
కలసిన శుభ సందర్భములోన
సుగ్రీవుడు శ్రీరాముని చూచి
మన, సుఖదుఃఖములొకటని పలుకుచు.

నిండుగ పూసిన తరువు శాఖను
విరచి ఆసనము చేసె రామునికి
హనుమంతుడు ఒక చందన శాఖను
విరచి లక్ష్మణుని కూర్చొన చేసెను.

తరువు శాఖపై రామచంద్రునితో
తను కూర్చొని సుగ్రీవుడు పలికెను
"రామా ! వాలి నాకు అన్నయగు
భీకరమైన పరాక్రమవంతుడు.

నాపై కోపము నిండిన వాలి
రాజ్యమునుండి తరిమివేసెను
నా భార్యను చేపట్టెను అతడు
అడవులబట్టి తిరుగుచుంటిని

కరుణ నిండిన మనసుతో నీవు
అనుగ్రహించుము ఓ నరపుంగవ !
వాలిభయమది తీర్చునట్టుగా
అభయమునిమ్మ దశరథనందన !"

రవిసుతుపలుకులు వినిన దాశరథి
శరణాగతులకు రక్షకుడై మరి
స్నేహధర్మము తెలిసిన ధీరుడు
మందహాసముతో పలికె ప్రియముగా.

॥శ్రీ రఘు రాముని॥

''మైత్రికి ఫలము ఉపకారము సుమ !
తీరుగ తెలియుము వానరోత్తమా !
అధర్మపరుడగు వాలిని చంపెద
ధర్మము నెరపెద విక్రమస్ఫురణతో.

పిడుగుపాటుకు పగిలిన గిరివలె
పడును వాలి, నా బాణహతుడయి ''
రాముని పలుకుల సంతసమందెను
రమయు, రాజ్యము పొందినట్టుగా.

''వాలి మరణము తప్పదు కావున !
వీరపుంగవా ! అతిశీఘ్రముగా
వాడి బాణముల వాలిని కూల్చి
వానిభయమునువు తీర్చుము'' అనగా.

ప్రసంగ మటుల సాగుచుండగా
సీతాదేవి కమలలోచనకు
వాలికి, లంకాధీశునకపుడు
వామనయనములు అదిరెనొక్కపరి

॥శ్రీరఘురాముని॥

## 6. శ్రీరామ సుగ్రీవ సంభాషణము

రామచంద్రునితో సుగ్రీవుడట
పలికె తీరుగ సచివోత్తముడు
హనుమంతుడు మీ వివరములన్నీ
తెలిపెను వనముకు మీరు వచ్చుటది.

మిథిలాధీశుని కూతురు సీతతో
నీ తమ్ముడు యీ లక్ష్మణమూర్తితో
వనమున నీవు తిరుగుచుండగా
క్రూర రక్కసుడు మీకు తెలియకనె.

నీ సతి సీతను అపహరించుట
త్రోవలో జటాయు సంతము చేయుట
అంతయు వినిచెను ఆంజనేయుడు
నీ దుఃఖము నే తొలగించెదను.

పతివ్రతయగు సీతాదేవిని
దుష్ట రక్కసుడు ఎచట దాచినను
దనుజుని త్రుంచి వేదశృతిని
తెచ్చినరీతిగ తెచ్చెద తల్లిని.

పాతాళములో నుంచినగాని
ఆకాశములో దాచినగాని
నే తేగలుగుదు సీతాదేవిని
చింతింపగను వలదు నీవిక

రామా! నేను సత్యము చెప్పెద
సీతను దానవు లందగలేరు
విషభక్ష్యమును తినినవానివలె
మడయునుగాని మనలేదుసుమా!

అంబరవీధిని అతి తొందరగా
రావణుండు గొనిపోవు అతివను
ఆడుపామువలె అల్లల్లాడగ
నాతో, ఇట యీ నల్వురు గాంచిరి

ఆమెకూడ మము చూచినదయ్యా!
అంబరమందు నగలను కట్టి
మూట విసరెను మా హనుమంతుడు
భద్రపరచెనవి చూపెదనీకు

॥ శ్రీ రఘురామః ॥

నీ వాల్గంటివి అనగలేమో?
నీవు గుర్తుతో తెలుపుము'' అనగ
రాముడు వారిని తొందర చేసెను
పావని సొమ్ములు తెచ్చి చూపెను.

మూటగట్టిన వలువను గాంచెను
మూటలోనున్న నగలను గాంచెను
మంచుకమ్మిన చంద్రుని రీతిగ
రాముని చూపుల నిలచె నశ్రువులు.

హా సీతా! నా ప్రియురాలా యని
దుఃఖించుచును సొమ్ముల నంతట
గుండెల హత్తుకు-సర్పము రీతిగ
బుసలమాదిరి శ్వాసించెనట.

శోకించుచును స్మృతి దప్పినది
తిరిగి తేరుకొని సొమ్ముల చూపుచు
పచ్చిక నేలను నగలు రాలినవి
కావున చెక్కు చెదరక నిలచెను.

''సోదర! చూడుము నగలు చూడుము
సీతవి ఇవికద తీరుగ చూడుము''
అనుచు రాముడు నగలను చూపగ
వినయముతో సౌమిత్రి పలికెను.

''పాద పద్మములు దర్శించెదను
ప్రణామముంచి తరియించెదను
కావున అన్నా! అందెలు వదినవి
మిగిలిన నగలు గురుతు నెరుగను.''

॥శ్రీరఘురాముని॥

ఆరాటముతో నిండిన రాముడు
రవి సుతు నడిగెను సీత వివరము
వంచకుడుండెడి తావు అడిగెను
కూకటివేళ్ళతో కూల్చెదననెను.

"ఇచ్చట నేనయి చంపుటెట్లని
సందేహించకు సూర్యకుమారా!
ఇంతటి బాధకు నను గురి చేసెను
కావున రక్కసు లందర జంపెద.

చోరుని ఉనికి తెలియజేయుము
జాలము నేనిక సహించలేను
సతి అపహరణము ఓర్వజాలను
దుష్టుని ద్రుంచెద సూర్యకుమారా!".

॥శ్రీరఘురాముని॥

## 7. శ్రీరాముని అండ నిలచెదనని సుగ్రీవుడు బాస చేయుట

గద్గద కంఠముతో సుగ్రీవుడు
పలికెను అపుడు రామచంద్రునితో
"రక్కసు వివరము వాని ప్రదేశము
శక్తి యుక్తులను పూర్తిగ నెరుగను."

కానీ వినుము! వంత నొందకుము
ఏదో విధముగ భూమీ సుతను
నీ దరి చేర్చెడి యోచన చేతును
ముస్త్రము నన్ను నెయ్యము సాక్షి.

మాతను తెచ్చెద ప్రతినగ నెంచుము
ధైర్యము విడువకు మహాత్ముడవు కద
దుఃఖించుటది తగదు రాఘవా
వగపే మూలము గౌరవానికి.

సతీ వియోగపు దుఃఖము నెరుగుదు
కోతి నయినను ధైర్యము నుంటిని
ముదితకోసమై వగచుట ఏల
పండితుడవునువు చేయుట ఇటులా?

ధైర్యముతో కన్నీటిని కట్టుము
పట్టు సడలని పౌరుషమందుము
దుఃఖమునందు ధన నష్టమున
ప్రాణాపాయము భయమునందున

బుద్ధిబలముతో ధీరుడు నిలచును
శోకవశుడగు బుద్ధిహీనుడు
బరువుతో క్రుంగిన నావ సంద్రమున
మునిగిన రీతిగ మునుగు దుఃఖమున.

ముకుళితహస్తము లివిగను రామా!
నా స్నేహమునువు మన్నించు మయా!
ప్రార్థన నాది శత్రుహరణ నువు
ధైర్యము పూనుము పురుషపుంగవా!

నెయ్యముతోనే హితము చెప్పితి
నీకు చెప్పగా నే చాలుదునా!''
అనుచు పలుకగా రామచంద్రుడు
అశ్రుల నాపి పలికె ప్రియముగ

॥శ్రీరఘురాముని॥

"గుండెల హత్తుకు ప్రేమపంచి మరి
పలికెడి హితనిగ పలికితి వయ్యా!
ఆపదలందు ధైర్యము గరపిన
ఉత్తమ హితునిగ వర్తించితివి

అక్కరలో నా ప్రక్కల నిలచిన
ఒక్క హితుడవు బంధువు లెందుకు
నిక్కమయిన నీ కూరిమి పలుకుల
చక్కబడినది నా మనసెంతయొ

సతిని వెదకుట, రక్కసు ద్రుంచుట
వలయు యత్నము చేయుము నీవు
విత్తు జల్లుటకు అనువగు నేలను
నే చేయదగు కార్యము తెలుపుము.

సూర్యనందనా నా పలుకులవి
నిను మెప్పించగ పలుకగలేదు
అసత్యమెరుగను ఇక ముందాడను
శంకవదలుము శపదము చేసితి."

రాముని ప్రతిన హితవాక్యములు
వినిన సుగ్రీవుడు అతని సచివులు
అమితానందము నందిరి అచట
కార్యసిద్ధియని తలచె సుగ్రీవుడు.

## 8. సుగ్రీవుని దుఃఖము-శ్రీరాముని ధైర్యోక్తులు

సుగ్రీవుడు పలికెను వినయమునిండి
రామానుజుడు వినుచుండగను
"నీ స్నేహముతో కపినయినా నను
రామ నేస్తమని గౌరవింతురు.

॥శ్రీరఘురాముని॥

నీ సాయముతో స్వర్గపురమది
లభించకలదు మాన్యుడనయితిని
నీ నెయ్యముతో నావారలకు
పూజనీయుడను అయితిని రాఘవ.

నా స్నేహము నువు తెలుసుకొందువు
నే నుడివిన అది ఆత్మప్రశంసయే
స్నేహితుడయినచో లోపము లెంచక
ఉత్తమ గతిగా నెయ్యమెంచవలె.

శరీరమునకు కరములమాదిరి
కంటికి రెప్పల మాదిరిగానే
నిలచి మిత్రుల కార్యము లన్నియు
ఆలోచించక నెరవేర్చవలె.''

సుగ్రీవుడటు పలుకగ రాముడు
తమ్ముడు ప్రక్కన వినుచుండగను
''నీవు నుడివినది నిక్కమేసుమా
నే గ్రహించితి నెయ్యపు విలువ.''

సంభాషణమటు సాగుచుండగా
క్రొత్తచిగురులు పూలునిండిన
తరుశాఖలను క్రొత్తవివేసి
దాశరథులను కూర్చొనజేసిరి.

తిరిగి పలికెను రవిసుతుడపుడు
''అన్న వాలిచే తరుమబడితిని
ఋష్యమూకమున దాగియుంటిని
దుఃఖము తీర్చి నను రక్షించుము.''

॥శ్రీరఘురామున॥

పలికెను లీలగ నవ్వుచు రాముడు
''నా మిత్రుడవు మేలు చేసెదను
కీడు చేయుటది రిపు లక్షణము
చంపెద వాలిని వ్యధ నీకేల?

నా శరములు అతి వేగము గలవి
మిరుమిట్లు గొలుపుచు భయంకరమవి
స్కందవనమున పుట్టినట్టివి
వజ్రాయుధముతో సమానమైనవి.

భయంకరమయి కోపము నిండిన
సర్పమువంటి శరములు చూడుము
వజ్రాయుధపు పాటుకు గిరివలె
నీతిలేని ఆ వాలి కూలును.''

''అగ్నిసాక్షిగ చెలిమి చేసితివి
చేయి కలిపి నా మనసు గెలిచితివి
దుఃఖానలము కాల్చగ తెలిపితి
చిన్నవిషయము కాదు రాఘవా!''

అనుచు పలుకుచు దుఃఖమునిండి
కన్నులనీరు పారుచుండగా
డగ్గుత్తికతో మాటలు పెగలక
సూర్యనందనుడు శోకము నిండెను.

ధైర్యము తెచ్చుకు సుగ్రీవుడట
వాలి చేసిన దుష్కార్యములను
నిర్దయుడై తన హితులందరిని
చెరలో నుంచుట తెలిపెను అపుడు.

||శ్రీ రఘురాముని||

''రాజుగ వాలి ఏలుచుండగ
యువరాజగు నను వెడలగొట్టెను
నా ఇల్లాలిని అపహరించెను
నను జంపుటకై యత్నము నుండెను.

నను జంపుటకై వచ్చినవారిని
తెలుసుకు వారిని చంపుట నా పని
కావున, మొదట మిమ్ముల చూచి
భయము నందుటకు కారణ మదియే.

ఈ హనుమంతుడు ముందు నిలువగా
మిగిలిన ఈ కపులందరు నన్ను
ప్రాణప్రదముగా కాపాడగను
బ్రతికియుంటిని దశరథ నందన.''

అంతట రాముడు అడిగె రవిసుతుని
''మీ వైరమునకు కారణమేమి?
కారణమల్పము అయిన మాటలతో
సమాధానము చేయగ చాలుదు.

వైరకారణము బలమయినచో యిక
వాలిని కూల్చి కార్యము తీర్చెద
నదివలె నా మది పరుగిడుచున్నది
విశదపరచుము సర్వము యిపుడే.

వింటిని ఎక్కు పెట్టకమునుపే
సర్వము తెలుపుము ఓ సుగ్రీవా!
వింటినుండి మరి శరము వెడలెనా
వాలి చచ్చును నిశ్చయమ్ముగా.''

॥శ్రీరఘురాముని॥

## 9. సుగ్రీవుడు వైరకారణము నివేదించుట.

తీరుగ పలికెను రవిసుతుడంతట
"ఇరువురు పుత్రులు మా జనకునకు
అందు జ్యేష్ఠుడు వీరుడు వాలి
చిన్నవాడను నేను రాఘవా!

ప్రేమగ బరగెడి వాలి అంతట
తండ్రి గతించగ రాజై ఏలగ
వినయమునిండి హితమును గోరెడి
బంటుగ నాతని సేవలు చేసితి.

కాలము ఆ విధి జరుగుచుండగా
మయుని తనయుడు-దుందుభి అన్న
మాయావి రక్కసుడు స్త్రీ నిమిత్తమై
వైరము వాలితో కలిగి యుండగ

మాటు మణిగిన నిశీధిలోన
మదించిపోయి పోరుకువచ్చి
నగరి ముందర నిలబడి వాడు
అతి భీకరముగ అరచు చుండగా

రోషమునిండి పానుపునుండి
లేచిన వాలి పోరుకు సాగగ
ఉదయమువరకై వేచియుండమని
ముదితలు, నేనును, వేడిన వినకయె.

అన్న పోరుకు సాగగనంత
అనుసరించితిని సహాయపడగ
ముందరవాలిని గాంచి అంతట
పరుగిడ సాగెను ఆ మాయావి.

॥శ్రీరఘురాముని॥

వెన్నెలతోడుగ నుండగ వాలి
వెంబడించెను ఆ మాయావిని
అంతట వాడొక బిలమును గాంచి
అందు దూరెను ప్రాణభీతితో

నన్నుగాంచి నా అన్న బలికెను
నీ విచ్చటనే నిలబడియుండుము
బిలముజొచ్చి ఆ మాయావిని, నే
చంపి వచ్చెదను అనగా, నేను

అనుసరించెదను నిన్నే అనగ
వినకనె, అన్న, బిలము జొచ్చెను
నే నచ్చటనే ఒక ఏడాది
వేచియుంటిని వాలి కొరకునై

అంతట నెత్తుటి ప్రవాహమ్మది
బిలమునుండి అట వెడలజొచ్చెను
నురగలు వెడలెను, రక్కసి అరుపులు
వాలి రోదనగ వినవచ్చినవి.

అన్న అసువులు బాసెను అనుకొని
దుష్ట దనుజుని భీతి చేతను
కొండ నొక్కటి బిల ద్వారమున
అడ్డముగా పడవేసి వగచుచు

అన్నకు జలములు వదలి నేనట
దుఃఖము నిండి పురముజేరి, మరి
అన్న మరణము తెలియనివ్వక
రోజులంతట దొర్లించగను

॥ శ్రీ రఘురాముని ॥

విషయము మెల్లగ తెలిసిన సచివులు
వానర రాజ్యము నప్పగించిరి
వాలి అంతట ఆ మాయావిని
అంతముజేసి తిరిగి వచ్చెను.

రాజ్య కాంక్షతో అన్నను వదలి
పురము జేరితిని అనుకొని అతడు
క్రోధమునిండి కుమతీ నువ్వు
తమ్మునివా ! నా శత్రువగుదువుర !

నమ్మిన నన్ను వదలివచ్చితివి
బిలమున కడ్డము కొండ నుంచితివి
కులుకుచుంటివి పట్టము కట్టుకు
పలికెను వాలి కోపము నిండి.

నా సచివులను మిత్రులందరిని
చెరలో నుంచెను ఆ కోపిష్ఠి
బలగమ్ములతో వాలిని నేను
నిగ్రహించగ చాలియున్నను

అన్న కావున తప్పగ తలచిన-
శాంతము రాగా దయచూపునని
గౌరవించుటకు ఫలమిది నాకు
ప్రాణము కొరకై పరుగులు తీయుట.

అసురుని చంపి పురము జొచ్చెడి
అన్నకు ఎదురుపోయి భక్తితో
నమస్కరించగ నను చూడకనే
ముఖము త్రిప్పెను కలవరపడితిని

॥శ్రీ రఘురాముని॥

